మోక్షాన్ని ప్రసాదించినవాడూ, ఆనందానికి మూలమైన ముకుందుడైన శ్రీమహావిష్ణువును నేను ఆశ్రయిస్తున్నాను !!

- **విశేషాలు:** ఈ శ్లోకంలో విష్ణువు శంఖం మరియు సుదర్శన చక్రంతో ప్రకాశించే చేతులను కలిగి ఉన్నాడని, ఆయన మెడలో అందమైన పూలమాల ఉంటుందని వర్ణించారు. ఆయన ముచుకుందుడికి మోక్షాన్ని ప్రసాదించిన కరుణామయుడు మరియు ఆనందానికి మూలమైన వాడు. కవి అటువంటి ముకుందుని ఆశ్రయిస్తున్నట్లు చెబుతున్నారు.

**|| ఆర్యా ద్విశతి - 79వ శ్లోకము ||**

- **శ్లోకము:** తద్వరణోత్తరభాగే తారాపతిబింబచుంబినిజశృంగః | వివిధమణీగణఖచితో వితరతు సాలో వినిర్మలాం ధిషణామ్ || ౭౯
- **ప్రతిపదార్థము: తద్వరణోత్తరభాగే** - ఆ (నానారత్నమయ) ప్రాకారమునకు పై భాగమునందు ఉండు, **తారాపతిబింబ** - చంద్రబింబమును, **చుంబి** - స్పృశించుచున్న, **నిజశృంగః** - తనయొక్క శిఖరములు (మిక్కిలి పొడవగు శిఖరములు) కలదియు, **వివిధమణీగణఖచితః** - పలురకములైన మణులతో పొదుగబడినదియు అగు, **సాలః** - ప్రాకారము, **వినిర్మలాం** - మిక్కిలి స్వచ్ఛమైన, **ధిషణాం** - బుద్ధిని, **వితరతు** - ఇచ్చుగాక !!
- **తాత్పర్యము:** 18వ ప్రాకారమైన నానారత్న ప్రాకారమునకు పై భాగము నందు, చంద్రబింబమును స్పృశించుచున్న పొడవైన శిఖరములు కలదియు, పలురకములైన మణులతో పొదగబడినది అయిన ప్రాకారము (19వ ప్రాకారము) - నాకు స్వచ్ఛమైన బుద్ధిని ప్రసాదించుగాక !!
- **విశేషాలు:** ఈ శ్లోకంలో పంతొమ్మిదవ ప్రాకారం వర్ణించబడింది. ఇది నానారత్న ప్రాకారానికి పైన ఉంటుంది మరియు దాని శిఖరాలు చంద్రుని తాకుతున్నట్లుగా ఎత్తుగా ఉంటాయి. ఈ ప్రాకారం వివిధ రకాల మణులతో పొదగబడి ఉంటుంది మరియు ఇది స్వచ్ఛమైన బుద్ధిని ప్రసాదిస్తుందని విశ్వసిస్తారు.

**|| ఆర్యా ద్విశతి - 80వ శ్లోకము ||**

- **శ్లోకము:** ప్రాకారద్వితయాంతరకక్ష్యాం పృథురత్ననికరసంకీర్ణామ్ | నమత సహస్రస్తంభక మండపనామ్నాఽతివిశ్రుతాం భువనే || ౮౦
- **ప్రతిపదార్థము: ప్రాకారద్వితయాంతరకక్ష్యాం** - ఆ రెండు (నానారత్న, నానామణిమయ) ప్రాకారముల మధ్య భూమి యందు ఉండు, **పృథు** - గొప్పవియగు, **రత్న** - మణుల, **నికర** - గుంపులచేత, **సంకీర్ణాం** - నిండినదియు, **సహస్రస్తంభక మండపనామ్నా** - సహస్రస్తంభక మంటపమను పేరుతో, **భువనే** - ప్రపంచమునందు, **అతి విశ్రుతాం** - మిక్కిలి ప్రసిద్ధమైనదియు దానికి, **నమత** - నమస్కరించుచున్నాను !!

- **తాత్పర్యము:** నానారత్న, నానామణిమయ ప్రాకారముల మధ్య భూమి యందు ఉండు, గొప్పవైన మణులచేత నిండినటువంటిది, లోకమున మిక్కిలి ప్రసిద్ధమైనది అయిన సహస్ర స్తంభ మంటపమునకు నమస్కరించుచున్నాను !!
- **విశేషాలు:** ఈ శ్లోకంలో నానారత్న మరియు తర్వాతి ప్రాకారం మధ్య ఉన్న సహస్ర స్తంభాల మంటపం వర్ణించబడింది. ఈ మంటపం గొప్ప రత్నాల సమూహంతో నిండి ఉంటుంది మరియు ప్రపంచవ్యాప్తంగా దాని ప్రత్యేకతకు ప్రసిద్ధి చెందింది. కవి ఈ అద్భుతమైన మంటపానికి నమస్కరిస్తున్నారు.

**|| ఆర్యా ద్విశతి - 81వ శ్లోకము ||**

- **శ్లోకము:** ప్రణుమ స్తత్ర భవానీసహచర మీశాన మిందుఖండధరమ్ | శృంగారనాయికా మనుశీలనభాజోఽపి భృంగినందిముఖాన్ || ౮౧
- **ప్రతిపదార్థము: తత్ర** - ఆ సహస్ర స్తంభక మంటపము నందు ఉండు, **భవానీసహచరం** - పార్వతీదేవితో కూడినవాడును, **ఇందుఖండధరం** - బాలహంద్రుని శిరస్సుపై ధరించినవాడును, **ఈశానాం** - శివుని, **శృంగారనాయికా** - శృంగారము అంటే సౌందర్యము, సౌందర్యనాయిక అయిన శ్రీలలితాంబిక యొక్క, **మను** - మంత్రమును, **శీలనభాజః** - జపించుచున్నవారగు, **భృంగినందిముఖాన్** - భృంగి, నంది మొదలగు ప్రమథ గణములను, **ప్రణుమః** - స్తుతించుచున్నాను !!
- **తాత్పర్యము:** సహస్ర స్తంభ మంటపము నందు ఉండు, బాలచంద్రుని శిరసున ధరించి పార్వతీసహితుడైన ఈశానుని మరియు సౌందర్యనాయిక అయిన శ్రీలలితాంబికాదేవి మంత్రమును జపించుచున్న భృంగి, నంది మొదలగు ప్రమథ గణములను నేను స్తుతించుచున్నాను !!
- **విశేషాలు:** ఈ శ్లోకంలో సహస్ర స్తంభ మంటపంలో కొలువై ఉన్న పార్వతీదేవితో కూడిన ఈశానుడు (శివుడు) మరియు శ్రీలలితాంబిక యొక్క మంత్రాన్ని జపించే భృంగి, నంది వంటి ప్రమథ గణాలను కవి స్తుతిస్తున్నారు. ఈశానుడు స్వయంగా లలితాదేవిని సేవిస్తాడని పురాణాలు చెబుతున్నాయి.

**|| ఆర్యా ద్విశతి - 82వ శ్లోకము ||**

- **శ్లోకము:** తస్యైణవాహనయోజనదూరే వందే మనోమయం వప్రమ్ | అంకూరన్మణికిరణామంతరకక్ష్యాం చ నిర్మలా మనయోః || ౮౨
- **ప్రతిపదార్థము: తస్య** - దానికి (వివిధ మణిమయ ప్రాకారమునకు), **ఏణవాహనయోజనదూరే** - ఏడు యోజనముల దూరము నందు, (జింకను వాహనముగా కలవాడు), **మనోమయం** -

మనోమయమగు, **వప్రమ్** - ప్రాకారమును, **నిర్మలాం** - స్వచ్ఛమైనదియు, **అంకూరత్** - ప్రకాశించుచున్న, **మణికిరణాం** - మణికిరణముల కాంతులు కలదియు, **అనయోః అంతరకక్ష్యాం చ** - ఆ రెంటి ప్రాకారముల మధ్య ప్రదేశమును, **వందే** - స్తుతించుచున్నాను !!

- **తాత్పర్యము:** వివిధ మణిమయ ప్రాకారమునకు (19వ) ఏడు యోజనముల దూరము నందు, మనోమయ ప్రాకారము (20వ ప్రాకారము) కలదు, ఈ రెండు ప్రాకారముల మధ్యన ఉండు స్వచ్ఛమైన ప్రకాశించుచున్న మణికిరణ కాంతులు కల మధ్య ప్రదేశమును నేను స్తుతించుచున్నాను !!
- **విశేషాలు:** ఈ శ్లోకంలో పంతొమ్మిదవ ప్రాకారానికి ఏడు యోజనాల దూరంలో ఉన్న ఇరవైవ మనోమయ ప్రాకారాన్ని కవి స్తుతిస్తున్నారు. ఈ రెండు ప్రాకారాల మధ్య ఉన్న ప్రదేశం స్వచ్ఛంగా మరియు ప్రకాశవంతమైన మణి కిరణాలతో నిండి ఉంటుందని వర్ణించారు.

**|| ఆర్యా ద్విశతి - 83వ శ్లోకము ||**

- **శ్లోకము:** తత్రైవామృతవాపీం తరళతరంగావలీఢతటయుగ్మాం | ముక్తామయ కలహంసీ ముద్రిత కనకారవిందసందోహామ్ || ౮౩
- **ప్రతిపదార్థము: తత్రైవ** - అచ్చటనే ఉండు, **తరళ** - కదులుచున్న, **తరంగ** - అలలచేత, **అవలీఢ** - వ్యాపింపబడిన, **తటయుగ్మాం** - రెండు గట్టులు కలదియు, **ముక్తామయ** - ముత్యముల వంటి, **కలహంసీ** - కలహంసల చేత, **ముద్రిత** - అలంకరింపబడిన, **కనకారవింద** - బంగారు తామరల, **సందోహామ్** - గుంపులు కలదియు ...
- **తాత్పర్యము:** అక్కడనే కదులుతున్న అలలతో నిండిన రెండు గట్లు కలదియు, ముత్యాల వంటి కలహంసలతో అలంకరించబడిన బంగారు తామరల గుంపులు కలదియు అయిన అమృతపు బావిని (85వ శ్లోకము నందు వివరణ ఇవ్వబడినది) ధ్యానించుచున్నాను.
- **విశేషాలు:** ఈ శ్లోకంలో అమృతపు బావి యొక్క అందం వర్ణించబడింది. దాని కదులుతున్న అలలు గట్లను తాకుతున్నాయి. ముత్యాల వలె తెల్లని కలహంసలు మరియు బంగారు తామర పువ్వుల గుంపులు ఆ బావిని అలంకరిస్తున్నాయి. ఈ వర్ణన దివ్యమైన మరియు శాంతియుతమైన వాతావరణాన్ని సూచిస్తుంది.

**|| ఆర్యా ద్విశతి - 84వ శ్లోకము ||**

- **శ్లోకము:** శక్రోపలమయ భృంగీసంగీతోన్మేష ఘోషితదిగంతామ్ | కాంచనమయాంగవిలసత్ కారండవషండ తాండవమనోజ్ఞామ్ || ౮౪
- **ప్రతిపదార్థము: శక్రోపలమయ** - ఇంద్రనీలమణిమయమైన (సమానమైన), (**శక్ర** - ఇంద్ర, **ఉపల** - రాయి), **భృంగీ** - ఆడు తుమ్మెదల, **సంగీత** - గానముల, **ఉన్మేష** - ప్రకాశములచేత, **ఘోషిత** -

శబ్దించుచున్న, **దిగంతాం** - దిక్కులకొనలు కలదియు, **కాంచనమయ** - బంగారముతో సమానమైన, **అంగ** - శరీరముచేత, **విలసత్** - ప్రకాశించుచున్న, **కారండవ** - జలపక్షుల, **షండ** - సమూహము యొక్క, **తాండవ** - నర్తనముల చేత, **మనోజ్ఞాం** - సుందరమైనదియు ....

- **తాత్పర్యము:** ఇంద్రనీల మణుల కాంతితో సమానమైన కాంతుల చేత, ఆడు తుమ్మెదల గానముల చేత, దిక్కుల కొనల వరకు వస్తున్న శబ్దములచేత, బంగారముతో సమానమైన శరీరము చేత, ప్రకాశిస్తున్న జలపక్షుల సమూహముల నర్తనములచేత, సుందరమైనది అయిన ....
- **విశేషాలు:** ఈ శ్లోకంలో అమృతపు బావి యొక్క పరిసరాలు వర్ణించబడ్డాయి. ఇంద్రనీల మణుల కాంతి వంటి నీలిరంగులో ప్రకాశిస్తూ, తుమ్మెదల పాటలు అన్ని దిక్కులకు వ్యాపిస్తున్నాయి. బంగారు శరీరాలు కలిగిన జలపక్షుల సమూహాలు నాట్యం చేస్తున్నట్లుగా కనబడుతున్నాయి. ఈ దృశ్యం చాలా మనోహరంగా ఉంది.

**|| ఆర్యా ద్విశతి - 85వ శ్లోకము ||**

- **శ్లోకము:** కురువిందాత్మలహల్లక కోరక సుషమాసమూహపాటలితామ్ | కలయే సుధాస్వరూపాం కందళితామంద కైరవామోదామ్ || ౮౫
- **ప్రతిపదార్థము: కురువిందాత్మక** - కెంపులతో సమానమైన, **లహల్లక** - ఎఱ్ఱ కలువల, **కోరక** - మొగ్గల, **సుషమా** - కాంతుల, **సమూహ** - గుంపులచేత, **పాటలితాం** - ఎఱ్ఱగా చేయబడినదియు, **కందళిత** - మొలచుచున్న (పుట్టుచున్న), **అమంద** - అధికమగు, **కైరవామోదాం** - కలువపువ్వుల పరిమళము కలిగినదియు అగు, **అమృతవాపీం** - అమృతపు బావిని (83వ శ్లోకము నుండి..) **కలయే** - ధ్యానించుచున్నాను !!
- **తాత్పర్యము:** కెంపులతో సమానమైన ఎర్ర కలువల గుంపులచేత ఎర్రగా చేయబడినది, గొప్ప కలువపువ్వుల పరిమళము కలిగినది అయిన అమృతపు బావిని ధ్యానించుచున్నాను.
- **విశేషాలు:** ఈ శ్లోకంలో అమృతపు బావి యొక్క స్వభావం మరియు ప్రాముఖ్యత వివరించబడ్డాయి. ఇది కెంపుల వంటి ఎర్ర కలువల మొగ్గలతో ఎరుపు రంగులో ప్రకాశిస్తుంది మరియు కలువ పువ్వుల యొక్క గొప్ప సువాసనతో నిండి ఉంటుంది. ఈ బావిలోని నీరు అమృతంతో సమానమైనదని, దీనిని సేవించిన వారికి సర్వసిద్ధులు కలుగుతాయని, వారు పాపాల నుండి విముక్తులవుతారని మరియు పక్షులు కూడా జరామరణాలు లేకుండా ఉంటాయని నమ్ముతారు. ఈ బావిని చేరుకోవడానికి నౌక మాత్రమే మార్గం, మరియు తారాదేవి మంత్రిణి మరియు దండనాథుల (శ్యామలాదేవి మరియు వారాహీదేవి) ఆజ్ఞతో మాత్రమే నౌకను నడుపుతుంది.

**|| ఆర్యా ద్విశతి - 86వ శ్లోకము ||**

- **శ్లోకము:** తద్వాపికాంతరాళే తరళే మణిపోతసీమ్ని విహరంతీమ్ | సిందూరపాటలాంగీం సితకిరణాంకూరకల్పితవతంసామ్ || ౮౬
- **ప్రతిపదార్థము: తద్వాపికాంతరాళే** - ఆ అమృతబావి మధ్యన ఉండు, **తరళే** - చలించుచున్న, **మణిపోతసీమ్ని** - మణులచే పొదగబడిన పడవయందు, **విహరంతీం** - విహరించుచున్నదియు, **సిందూరపాటలాంగీం** - సిందూరము వలె ఎఱ్ఱని దేహకాంతి కలిగినదియు, **సితకిరణ** - చంద్రుని యొక్క, **అంకూర** - మొలకచేత (అనగా బాలచంద్రుని చేత), **కల్పిత** - చేయబడిన, **వతంసామ్** - శిరోభూషణము కలదియు...
- **తాత్పర్యము:** ఆ అమృతబావి యందు ఉన్న మణులచే పొదగబడిన పడవ యందు చలించుచున్నది, సిందూరమువలె ఎఱ్ఱని దేహకాంతి కలదియు, బాలచంద్రుని శిరోభూషణముగా కలదియు అయిన తారాదేవిని ధ్యానించుచున్నాను.
- **విశేషాలు:** ఈ శ్లోకంలో అమృతపు బావిలో మణులచే అలంకరించబడిన కదులుతున్న పడవలో విహరిస్తున్న తారాదేవి వర్ణించబడింది. ఆమె సిందూరం వలె ఎర్రని శరీర కాంతిని కలిగి ఉంది మరియు బాలచంద్రునితో చేసిన శిరోభూషణాన్ని ధరించి ఉంది.

**|| ఆర్యా ద్విశతి - 87వ శ్లోకము ||**

- **శ్లోకము:** పర్వేందుబింబవదనాం పల్లవశోణాధర స్ఫురితహాసామ్ | కుటిలకబరీం కురంగీశిశునయనాం కుండలస్ఫురద్గండామ్ || ౮౭
- **ప్రతిపదార్థము: పర్వేందుబింబవదనాం** - పూర్ణచంద్రబింబము వంటి ముఖము కలిగినది, **పల్లవశోణాధర** - చిగుళ్లవలె ఎర్రని పెదవుల యందు, **స్ఫురిత** - ప్రకాశించుచున్న, **హాసాం** - చిరునవ్వు కలదియు, **కుటిలకబరీం** - వంకరలగు కేశభారము కలదియు, **కురంగీశిశునయనాం** - ఆడు జింకపిల్ల నయనముల వంటి కన్నులు కలదియు, **కుండల** - కుండలములచేత, **స్ఫురత్** - ప్రకాశించుచున్న, **గండాం** - చెక్కిళ్ళు కలదియు ...
- **తాత్పర్యము:** పూర్ణచంద్రుని పోలిన ముఖము కలిగినది, ఎర్రని పెదవుల యందు ప్రకాశించుచున్న చిరునవ్వు కలదియు, వంకరలు తిరిగిన కేశభారము కలిగినదియు, ఆడు జింకపిల్ల నయనముల వంటి కన్నులు కలదియు, కుండలములచేత ప్రకాశించుచున్న చెక్కిళ్ళు కలదియు అయిన తారాదేవిని ధ్యానించుచున్నాను.
- **విశేషాలు:** ఈ శ్లోకంలో తారాదేవి యొక్క సౌందర్యం మరింత వివరంగా వర్ణించబడింది. ఆమె పూర్ణచంద్రుని వంటి ముఖాన్ని, చిగుళ్ళ వలె ఎర్రని పెదవులపై ప్రకాశించే చిరునవ్వును కలిగి ఉంది. ఆమె వంకరలు తిరిగిన కేశాలు మరియు జింకపిల్ల కళ్ళ వంటి అందమైన కన్నులు కలది. ఆమె చెక్కిళ్ళు కుండలాల కాంతిచే ప్రకాశిస్తున్నాయి.

**|| ఆర్యా ద్విశతి - 88వ శ్లోకము ||**

- **శ్లోకము:** నికటస్థపోతనిలయాశ్శక్తీ శ్శయవిధృత హేమశృంగజలైః | పరిషించంతీం పరితస్తారాం తారుణ్యగర్వితాం వందే || ౮౮
- **ప్రతిపదార్థము: నికటస్థ** - సమీపము నందు ఉండు, **పోత** - పడవల యందు, **నిలయాః** - ఉన్నట్టి, **శక్తీః** - శక్తులు అను పేరుగల దేవతలగు పరిచారికలను, **శయ** - చేతుల యందు, **విధృత** - ధరించిన, **హేమశృంగ** - బంగారు శృంగముల నుండి, **జలైః** - నీళ్లచేత, **పరితః** - చుట్టునూ, **పరిషించంతీం** - బాగుగా తడుపుపుచున్నదియు, **తారుణ్యగర్వితాం** - యవ్వనము చేత శోభించుచున్న, **తారాం** - తారాదేవికి, **వందే** - నమస్కరించుచున్నాను !!
- **తాత్పర్యము:** సమీపమునందున్న పడవలలో నివసించే శక్తులు అనే పేరుగల పరిచారికలు, తమ చేతులలోని బంగారు శృంగాల నుండి నీటిని చుట్టూ చల్లుతూ ఉండగా, యవ్వనంతో ప్రకాశిస్తున్న తారాదేవికి నేను నమస్కరిస్తున్నాను.
- **విశేషాలు:** ఈ శ్లోకంలో తారాదేవి యొక్క పరిచారికలు ఆమెకు సేవ చేస్తున్న దృశ్యం వర్ణించబడింది. శక్తులు అనే దేవతలు సమీపంలోని పడవలలో ఉండి, బంగారు శృంగాల నుండి నీటిని చుట్టూ చల్లుతూ తారాదేవిని సేవిస్తున్నారు. తారాదేవి తన యవ్వనంతో మరింత అందంగా ప్రకాశిస్తోంది.

**|| ఆర్యా ద్విశతి - 89వ శ్లోకము ||**

- **శ్లోకము:** ప్రాగుక్తసంఖ్యయోజనదూరే ప్రణమామి బుద్ధిమయసాలమ్ | అనయోరంతరకక్ష్యా మష్టాపదరూపమేదినీరుచిరామ్ || ౮౯
- **ప్రతిపదార్థము: ప్రాగుక్తసంఖ్యయోజనదూరే** - ముందు చెప్పబడిన ఏడు యోజనముల దూరమునందు ఉండు, **బుద్ధిమయసాలం** - బుద్ధిమయమగు ప్రాకారమునకు (21వ ప్రాకారము), **ప్రణమామి** - నమస్కరించుచున్నాను, **అనయోః** - ఆ రెండిటి (బుద్ధిమయ, మనోమయ ప్రాకారముల), **అంతరకక్ష్యాం** - మధ్య ప్రదేశమునందున్న, **అష్టాపదరూప** - బంగారుమయమైన, **మేదినీ** - ప్రదేశము చేత, **రుచిరాం** - మనోజ్ఞమైనదియు..
- **తాత్పర్యము:** మనోమయ ప్రాకారమునకు ఏడు యోజనముల దూరము నందు ఉన్న బుద్ధిమయ ప్రాకారమునకు నమస్కరించుచున్నాను. ఈ మనోమయ, బుద్ధిమయ ప్రాకారములకు మధ్యప్రదేశమున బంగారుమయమైనది, మనోజ్ఞమైనది అయిన భూమిని కూడా స్తుతించుచున్నాను.

- **విశేషాలు:** ఈ శ్లోకంలో మనోమయ ప్రాకారానికి ఏడు యోజనాల దూరంలో ఉన్న బుద్ధిమయ ప్రాకారం వర్ణించబడింది. కవి ఈ ప్రాకారానికి నమస్కరిస్తున్నారు. అంతేకాకుండా, ఈ రెండు ప్రాకారాల మధ్య ఉన్న బంగారుమయమైన మరియు అందమైన భూమిని కూడా స్తుతిస్తున్నారు.

**॥ ఆర్యా ద్విశతి - 90వ శ్లోకము ॥**

- **శ్లోకము:** కాదంబరీనిధానాం కలయామ్యానందవాపికాంతస్యామ్ | శోణాశ్మనివహనిర్మిత సోపానశ్రేణిశోభమానతటామ్ ॥ ౯౦
- **ప్రతిపదార్థము: తస్యాం** - పైన చెప్పిన ప్రాకారముల మధ్య భూమి యందు, **కాదంబరీనిధానాం** - మద్యమునకు స్థానమును, **శోణాశ్మ** - ఎఱ్ఱని రాళ్ళ (కెంపుల), **నివహ** - గుంపులచేత, **నిర్మిత** - నిర్మింపబడిన, **సోపానశ్రేణి** - మెట్ల వరుసలచేత, **శోభమాన** - ప్రకాశించుచున్న, **తటాం** - గట్టులు కలదియు అగు, **ఆనందవాపికాం** - ఆనందమయమగు బావిని, **కలయామి** - ధ్యానించుచున్నాను !
- **తాత్పర్యము:** మనోమయ మరియు బుద్ధిమయ ప్రాకారముల మధ్య ప్రదేశమున ఉండు, మద్యమునకు స్థానము (అనగా బ్రహ్మానందమును అనుభవించే స్థితికి సంకేతము, తప్ప లౌకికముగా బుద్ధిమాంద్యము కల్పించే మద్యము కాదు..), కెంపుల చేత నిర్మింపబడిన మెట్ల వరుసలు కలిగిన తటములు (గట్ల)చే ప్రకాశించుచున్నది అయిన ఆనందబావిని ధ్యానించుచున్నాను !!
- **విశేషాలు:** ఈ శ్లోకంలో మనోమయ మరియు బుద్ధిమయ ప్రాకారాల మధ్య ఉన్న ఆనందమయమైన బావి వర్ణించబడింది. ఈ బావి బ్రహ్మానందాన్ని అనుభవించే స్థితికి సంకేతం. దీని గట్లు కెంపులతో నిర్మించిన మెట్ల వరుసలతో ప్రకాశిస్తున్నాయి. కవి ఈ ఆనందాన్నిచ్చే బావిని ధ్యానిస్తున్నారు.

**। ఆర్యా ద్విశతి - 91వ శ్లోకము ॥**

- **శ్లోకము:** మాణిక్యతరణి నిలయాం మధ్యే తస్యామదారుణకపోలామ్ | అమృతేశీత్యభిధానా మంతఃకలయామి వారుణీందేవీమ్ ॥ ౯౧
- **ప్రతిపదార్థము: తస్యాః మధ్యే** - ఆ ఆనందబావికి నడుమన ఉండు, **మాణిక్య** - రత్నములచేత పొదగబడిన, **తరణి** - పడవయందు, **నిలయాం** - ఉన్నట్టిదియు, **మదారుణకపోలామ్** - మద్యపాన మత్తుచేత ఎర్రని చెక్కిళ్ళి కలదియు, **అమృతేశీత్యభిధానాం** - అమృతేశి అను పేరు గల దేవతను (సుధామాలిని అని కూడా పేరు కలదు), **వారుణీం దేవీం** - వారుణి అను దేవిని (ఈమె నౌకాధినాయిక), **అంతః** - మనస్సునందు, **కలయామి** - ధ్యానించుచున్నాను !!

- **తాత్పర్యము:** ఆనందబావికి నడుమన ఉండు, రత్నములచేత పొదగబడిన పడవయందు ఉన్నట్టిది, ఎర్రని చెక్కిళ్ళు కలదియు అయిన అమృతేశి అను దేవిని, వారుణీదేవి అను దేవిని మనస్సునందు ధ్యానించుచున్నాను !!
- **విశేషాలు:** ఈ శ్లోకంలో ఆనందబావి మధ్యలో రత్నాల పడవలో కొలువై ఉన్న వారుణి దేవిని (అమృతేశి) కవి ధ్యానిస్తున్నారు. ఆమె మత్తుతో ఎర్రబారిన చెక్కిళ్ళతో ప్రకాశిస్తోంది. వారుణి దేవి ఈ బావి యొక్క నౌకకు అధిపతిగా భావించబడుతుంది.

**|| ఆర్యా ద్విశతి - 92వ శ్లోకము ||**

- **శ్లోకము:** సౌవర్ణకేనిపాతనహస్తాః సౌందర్యగర్వితాదేవ్యః | తత్పరితః స్థితిభాజో వితరంత్వస్మాక మాయుషాం వృద్ధిమ్ || ౯౨
- **ప్రతిపదార్థము: తత్పరితః** - ఆ ఆనందబావికి చుట్టును, **స్థితిభాజః** - వసించుచున్న వారును, **సౌవర్ణ** - బంగారముతో చేయబడిన, **కేనిపాతన** - పడవ నడుపు తెడ్డులను, **హస్తాః** - చేతులయందు ధరించినవారును, **సౌందర్యగర్వితాః** - తమ సౌందర్యముచేత గర్వించినవారును అగు, **దేవ్యః** - దేవతాస్త్రీలు, **అస్మాకం** - మాకు, **ఆయుషాం వృద్ధిమ్** - దీర్ఘాయుష్షును, **వితరంతు** - కలుగజేయుదురు గాక !!
- **తాత్పర్యము:** ఆ ఆనందబావికి చుట్టూ వసించుచున్నవారును, బంగారముతో చేయబడిన పడవ నడుపు తెడ్డులను హస్తముల యందు ధరించినవారును, తమ సౌందర్యముచేత గర్వించినవారును అయిన దేవతాస్త్రీలు, మాకు ఆయుర్వృద్ధిని కలుగజేయుదురుగాక !!
- **విశేషాలు:** ఈ శ్లోకంలో ఆనందబావి చుట్టూ ఉన్న దేవతా స్త్రీల గురించి వర్ణించారు. వారు బంగారు తెడ్డులను పట్టుకుని తమ అందంతో గర్వంగా ఉన్నారు. వారు భక్తులకు దీర్ఘాయువును ప్రసాదిస్తారని విశ్వసిస్తారు.

**|| ఆర్యా ద్విశతి - 93వ శ్లోకము ||**

- **శ్లోకము:** తస్య పృషదశ్వయోజనదూరే హంకారసాలమతితుంగమ్ | వందే తయోశ్చ మధ్యమకక్ష్యాం వలమానమలయపవనామ్ || ౯౩
- **ప్రతిపదార్థము: తస్య** - దానికి (బుద్ధిమయ) ప్రాకారమునకు, **పృషదశ్వయోజనదూరే** - ఏడు యోజనముల దూరము నందు ఉండు (**పృషదశ్వ** - వాయువు), **అతితుంగం** - మిక్కిలి పొడవైన, **అహంకారసాలం** - అహంకారమయమగు ప్రాకారమునకు, **తయోశ్చ** - ఆ రెండు (బుద్ధిమయ, అహంకారమయ) ప్రాకారముల, **మధ్యమకక్ష్యాం** - మధ్య ప్రదేశమునందు, **వలమాన** - వీచుచున్న, **మలయపవనామ్** - మలయమారుతమును, **వందే** - నమస్కరించుచున్నాను !!

- **తాత్పర్యము:** బుద్ధిమయ (21వ) ప్రాకారమునకు, ఏడు యోజనముల దూరము నందు ఉన్న అహంకారమయ ప్రాకారము (22వ)నకు మరియు, ఈ బుద్ధిమయ-అహంకారమయ ప్రాకారముల మధ్య ప్రదేశమునందు వీచుచున్న మలయమారుతమునకు నమస్కరించుచున్నాను !!
- **విశేషాలు:** ఈ శ్లోకంలో బుద్ధిమయ ప్రాకారానికి ఏడు యోజనాల దూరంలో ఉన్న అత్యంత ఎత్తైన అహంకారమయ ప్రాకారాన్ని మరియు ఈ రెండు ప్రాకారాల మధ్య వీస్తున్న మలయ పవనాన్ని కవి స్తుతిస్తున్నారు. మలయ పవనం చల్లగా మరియు సువాసనగా ఉంటుందని భావిస్తారు.

**II ఆర్యా ద్విశతి - 94వ శ్లోకము II**

- **శ్లోకము:** వినుమో విమర్శవాపీం సౌషుమ్నసుధాస్వరూపిణీం తత్ర | వేలాతిలంఘి వీచీకోలాహలభరిత కూలవనవాటీమ్ || ౯౪
- **ప్రతిపదార్థము: తత్ర** - అచ్చట, **వేలా** - హద్దులను (పొలిమేరలను), **అతిలంఘి** - అతిక్రమించి, మీరుచున్న, **వీచీ** - అలల, **కోలాహలం** - కలకల ధ్వనుల చేత, **భరిత** - నిండిన, **కూల** - తీరప్రదేశములందలి, **వనవాటీం** - వనముల సమూహము కలదియు, **సౌషుమ్నసుధాస్వరూపిణీం** - మహాయోగీశ్వరుల సుషుమ్న నాడి యందు ఉండు అమృతస్వరూపము గలదియు అగు, **విమర్శవాపీం** - విమర్శపు బావిని, **వినుమః** - నుతించుచున్నాను !!
- **తాత్పర్యము:** బుద్ధిమయ, అహంకారమయ ప్రాకారముల మధ్య ప్రదేశమునందు, హద్దులను మీరి వీచుచున్న అలలచేత నిండిన తీరప్రదేశమునందు వనముల సమూహములు కలదియు, మహాయోగీశ్వరుల సుషుమ్ననాడి యందు ఉండు అమృతస్వరూపము గలదియు అయిన విమర్శపు బావిని నమస్కరించుచున్నాను !!
- **విశేషాలు:** ఈ శ్లోకంలో బుద్ధిమయ మరియు అహంకారమయ ప్రాకారాల మధ్య ఉన్న విమర్శపు బావి వర్ణించబడింది. ఈ బావి యొక్క అలలు హద్దులు దాటి శబ్దం చేస్తున్నాయి మరియు దాని తీరాలలో వన సమూహాలు ఉన్నాయి. ఇది మహాయోగుల సుషుమ్న నాడిలోని అమృత స్వరూపంగా భావించబడుతుంది. ఈ బావికి నౌక అధిపతి కురుకుళ్ళ దేవి, ఆమె నల్లని శరీర ఛాయ మరియు నల్లని కంచుకం ధరించి ఉంటుంది.

**II ఆర్యా ద్విశతి - 95వ శ్లోకము II**

- **శ్లోకము:** తత్రైవ సలిలమధ్యే తాపింఛదళ ప్రపంచసుషమాభామ్ | శ్యామలకంచుకలసితాం శ్యామాం విధుబింబడంబర హరాస్యామ్ || ౯౫
- **ప్రతిపదార్థము: తత్రైవ** - ఆ విమర్శవాపియందు, **సలిలమధ్యే** - నీటి మధ్యన, **తాపింఛదళ** - కానుగు ఆకుల, **ప్రపంచ** - సమూహము యొక్క, **సుషుమ** - కాంతివంటి, **ఆభాం** - కాంతి గలదియు,

**శ్యామల** - నల్లని, **కంచుక** - చీరచేత, **లసితాం** - ప్రకాశించునదియు, **శ్యామాం** - మధ్యయౌవనము గలదియు, **విధుబింబ** - చంద్రబింబము యొక్క, **డంబర** - గర్వమును, **హర** - పోగొట్టు, **ఆస్యాం** - ముఖము కలదియు...

- **తాత్పర్యము:** ఆ విమర్శవాపి యందు ఉన్న జలముల మధ్యన, కానుగు ఆకుల సమూహముయొక్క కాంతిని కల్గినదియు, నల్లని చీరచేత ప్రకాశించుచున్నదియు, మధ్య యౌవనము కలదియు, చంద్రబింబము యొక్క గర్వమును పోగొట్టు ముఖబింబము కలదియు అయిన కురుకుళ్ళ దేవిని ధ్యానించుచున్నాను.
- **విశేషాలు:** ఈ శ్లోకంలో విమర్శపు బావి మధ్యలో కొలువై ఉన్న కురుకుళ్ళ దేవి వర్ణించబడింది. ఆమె కానుగ ఆకుల కాంతి వంటి శరీర ఛాయను, నల్లని చీరను ధరించి, మధ్య వయస్సులో ఉంది. ఆమె ముఖం చంద్రుని యొక్క గర్వాన్ని కూడా పోగొట్టేంత అందంగా ఉంది.

**॥ ఆర్యా ద్విశతి - 96వ శ్లోకము ॥**

- **శ్లోకము:** ఆభుగ్నమసృణ చిల్లీహసితాయుగ్మశర కార్ముకవిలాసామ్ | మందస్మితాంచితముఖీం మణిమయతాటంకమండితకపోలామ్ || ౯౬
- **ప్రతిపదార్థము: ఆభుగ్న** - చక్కగా వంకర తిరిగిన, **మసృణ** - నునుపైన, **చిల్లీ** - కనుబొమలచేత, **హసిత** - నవ్వబడిన (తిరస్కరింపబడిన), **అయుగ్మశర** - మన్మథుని, **కార్ముక** - వింటి యొక్క, **విలాసాం** - చక్కదనము కలదియు (ఆ దేవి కనుబొమలు మన్మథుని వింటికంటెనూ సుందరమైనవి), **మందస్మిత** - చిరునవ్వుచేత, **అంచిత** - సుందరమైన, **ముఖీం** - వదనము గలదియు, **మణిమయ** - రత్నఖచితమైన, **తాటంక** - కర్ణాభరణముల చేత, **మండిత** - అలంకరింపబడిన, **కపోలాం** - చెక్కిళ్ళు గలదియు ....
- **తాత్పర్యము:** మన్మథుని యొక్క వింటి కంటె సుందరమైన చక్కగా వంకర తిరిగిన నునుపైన కనుబొమల సౌందర్యము కలిగినదియు, చిరునవ్వుతో కూడిన వదనము కలదియు, రత్నఖచిత కర్ణాభరణములచేత అలంకరింపబడిన చెక్కిళ్ళు గలదియు అయిన కురుకుళ్ళ దేవిని ధ్యానించుచున్నాను.
- **విశేషాలు:** ఈ శ్లోకంలో కురుకుళ్ళ దేవి యొక్క ముఖ సౌందర్యం వర్ణించబడింది. ఆమె కనుబొమలు మన్మథుని విల్లు కంటే అందంగా ఉన్నాయి. ఆమె ముఖంపై మందహాసం నిండి ఉంది మరియు ఆమె చెక్కిళ్ళు రత్నాల చెవిపోగులతో అలంకరించబడి ప్రకాశిస్తున్నాయి.

**॥ ఆర్యా ద్విశతి - 97వ శ్లోకము ॥**

- **శ్లోకము:** కురువిందతరణి నిలయాం కులాచలస్పర్ధి కుచనమన్మధ్యామ్ | కుంకుమవిలిప్తగాత్రీం కురుకుళ్లాం మనసి కుర్మహే సతతమ్ || ౯౭
- **ప్రతిపదార్థము: కురువిందతరణినిలయాం** - కెంపులచే చేయబడిన పడవ యందు ఉన్నదియు, **కులాచల** - కులపర్వతములతో, **స్పర్ధి** - కలహించుచున్న (వాటి కంటే గొప్పవి అని), **కుచ** - స్తనములచేత, **నమత్** - వంగిన, **మధ్యామ్** - నడుము కలదియు, **కుంకుమవిలిప్తగాత్రీం** - కుంకుమచేత పూయబడిన శరీరము గలదియు అగు, **కురుకుళ్ళాం** - కురుకుళ్ళ అను దేవతను (ఈమెయే నౌకేశ్వరీ దేవి), **సతతం** - ఎల్లప్పుడూ, **కుర్మహే** - ధ్యానించుచున్నాను !!
- **తాత్పర్యము:** కెంపులచేత చేయబడిన పడవయందు ఉన్నదియు, కులపర్వతముల కంటే గొప్పవైన స్తనములు కలిగినది (ఇది అమ్మవారి మాతృతనమునకు నిదర్శనము, ఆబ్రహ్మకీటజనని అయిన అమ్మవారి యొక్క పోషించే తత్వాన్ని, మాతృతనాన్ని వర్ణించారు మహర్షి), ఆ స్తనభారము చేత వంగిన నడుము గలదియు (ఇది గొప్ప సాముద్రిక లక్షణం), కురుకుళ్ళా దేవిని (నౌకేశ్వరీదేవి అని కూడా నామము) ఎల్లప్పుడూ ధ్యానించుచున్నాను !!
- **విశేషాలు:** ఈ శ్లోకంలో కురుకుళ్ళ దేవి యొక్క ఇతర శరీర లక్షణాలు వర్ణించబడ్డాయి. ఆమె కెంపుల పడవలో కూర్చుని ఉంటుంది. ఆమె స్తనాలు కుల పర్వతాల కంటే గొప్పగా వర్ణించబడ్డాయి, ఇది ఆమె మాతృత్వాన్ని సూచిస్తుంది. ఆ స్తనాల బరువుకు ఆమె నడుము కొద్దిగా వంగి ఉంటుంది. ఆమె శరీరం కుంకుమపువ్వుతో పూయబడి ఎరుపు రంగులో ప్రకాశిస్తుంది.

**|| ఆర్యా ద్విశతి - 98వ శ్లోకము ||**

- **శ్లోకము:** తత్సాలోత్తరభాగే భానుమయం వప్రమాశ్రయే దీప్రమ్ | మధ్యం తు విపులమనయోర్మన్యే విక్రాంత మాతపోద్గారమ్ || ౯౮
- **ప్రతిపదార్థము: తత్సాలోత్తరభాగే** - ఆ అహంకారమయ ప్రాకారమునకు పై భాగము నందు ఉండు, **దీప్రమ్** - ప్రకాశించుచున్న, **భానుమయం** - సూర్యమయమైన, **వప్రమ్** - ప్రాకారమును, **ఆశ్రయే** - సేవించుచున్నాను, **విపులం** - విశాలమైన, **విక్రాంతం** - పరాక్రమవంతమగు, తేజోమయమగు, **ఆతపోద్గారమ్** - ఎండల యొక్క పుంజము గల, **అనయోః** - ఆ రెంటి (అహంకార, రవిమయ ప్రాకారములకు), **మధ్యం తు** - మధ్య ప్రదేశమును, **మన్యే** - ధ్యానించుచున్నాను !!
- **తాత్పర్యము:** అహంకారమయ (23వ) ప్రాకారమునకు పై భాగమునందు ప్రకాశించుచున్న సూర్యమయ (24వ) ప్రాకారమును నేను సేవించుచున్నాను. విశాలమైన, తేజోమయమైన సూర్య కిరణాల యొక్క కాంతులు గల ఆ రెంటి మధ్య ప్రదేశమును నేను ధ్యానించుచున్నాను !!

- **విశేషాలు:** ఈ శ్లోకంలో అహంకారమయ ప్రాకారానికి పైన ఉన్న ప్రకాశవంతమైన సూర్యమయ ప్రాకారాన్ని కవి ఆశ్రయిస్తున్నాడు. ఈ రెండు ప్రాకారాల మధ్య విశాలమైన ప్రదేశం సూర్యకిరణాల యొక్క శక్తివంతమైన కాంతితో నిండి ఉంటుందని ఆయన భావిస్తున్నాడు.

**॥ ఆర్యా ద్విశతి - 99వ శ్లోకము ॥**

- **శ్లోకము:** తత్ర కురువిందపీఠే తామరసే కనక కర్ణికాఘటితే | ఆసీనమరుణవాసన మమ్లానప్రసవమాలికాభరణమ్ ॥ ౯౯
- **ప్రతిపదార్థము: తత్ర** - ఆ ప్రదేశమునందు, **కురువిందపీఠే** - కెంపుల పీఠమునందు, **తామరసే** - తామరపువ్వునందలి, **కనకకర్ణికాఘటితే** - బంగారు కుండలములను ధరించినవాడును, **ఆసీనం** - కూర్చొని ఉన్నవాడును, **అరుణవాససం** - ఎఱ్ఱని వస్త్రము ధరించినవాడును, **అమ్లాన** - వాడని, **ప్రసవమాలికాభరణమ్** - పుష్పహారమును ధరించినవాడును ....
- **తాత్పర్యము:** అహంకారమయ రవిమయ ప్రాకారములకు మధ్య ప్రదేశమునందు ఉన్న కెంపులపీఠమునందు, తామరపువ్వు నడుమ బంగారు కుండలములను ధరించి కూర్చొని ఉన్నవాడు, ఎర్రని వస్త్రము ధరించి, వాడని పుష్పమాలికను ధరించినవాడు అగు మార్తాండభైరవుని ధ్యానించుచున్నాను.
- **విశేషాలు:** ఈ శ్లోకంలో మార్తాండభైరవుడు వర్ణించబడ్డాడు. ఆయన కెంపుల పీఠంపై బంగారు తామరపువ్వు మధ్య కూర్చుని ఉన్నాడు. ఆయన ఎర్రని వస్త్రాలను ధరించి, వాడని పూలమాలలను అలంకరించుకున్నాడు.

**॥ ఆర్యా ద్విశతి - 100వ శ్లోకము ॥**

- **శ్లోకము:** చక్షుష్మతీ ప్రకాశనశక్తిచ్ఛాయా సమారచితకేళిమ్ | మాణిక్యమకుటరమ్యం వందే మార్తాండభైరవం హృదయే ॥ ౧౦౦
- **ప్రతిపదార్థము: చక్షుష్మతీ** - చక్షుష్మతీ అను పేరుగల శక్తి, **ప్రకాశనశక్తిః** - ప్రకాశనశక్తి అను పేరుగల శక్తి, **ఛాయా** - ఛాయాదేవి అను పేరుగల శక్తి, ఈ ముగ్గురు శక్తులతో (భార్యలతో), **సమారచిత** - చేయబడిన, **కేళిమ్** - విలాసము కలవాడును, **మాణిక్యమకుటరమ్యం** - మాణిక్యమయమైన కిరీటమును ధరించుటచే సుందరమైనవాడును అగు, **మార్తాండభైరవం** - మార్తాండభైరవుడను సూర్యాధిదేవతను, **హృదయే** - మనస్సునందు, **వందే** - ధ్యానించుచున్నాను / నమస్కరించుచున్నాను !!
- **తాత్పర్యము:** చక్షుష్మతి, ప్రకాశశక్తి మరియు ఛాయాదేవి అను ముగ్గురు శక్తులనెడి భార్యలతో కూడి విలాసముగా ఉన్నవాడును, మాణిక్యమయ కిరీటమును ధరించుటచే సుందరమైనవాడును అగు, మార్తాండభైరవుడను సూర్యాధిదేవతకు మనస్సునందు నేను నమస్కరిస్తున్నాను !!

- **విశేషాలు:** ఈ శ్లోకంలో మార్తాండభైరవుడు తన ముగ్గురు భార్యలైన చక్షుష్మతి, ప్రకాశనశక్తి మరియు ఛాయాదేవితో కలిసి విలాసంగా ఉన్నట్లు వర్ణించారు. ఆయన మాణిక్యాల కిరీటాన్ని ధరించి చాలా అందంగా కనిపిస్తున్నాడు. కవి అటువంటి సూర్యాధిదేవతను తన హృదయంలో ధ్యానిస్తున్నాడు.

**॥ ఆర్యా ద్విశతి - 101వ శ్లోకము ॥**

- **శ్లోకము:** ఇందుమయసాలమీడే తస్యోత్తరతస్తుషారగిరిగౌరమ్ | అత్యంత శిశిరమారుత మనయోర్మధ్యం చ చంద్రికోద్గారమ్ || ౧౦౧
- **ప్రతిపదార్థము: తస్యోత్తరతః** - ఆ రవిమయప్రాకారమునకు పై భాగమునందు ఉండు, **తుషారగిరిగౌరం** - హిమవత్పర్వతము వలె తెల్లగానున్నట్టి, **ఇందుమయసాలం** - చంద్రమయమైన ప్రాకారమును, **చంద్రికోద్గారం** - వెన్నెల పుంజము గలదియు, **అత్యంతశిశిరమారుతం** - చల్లని గాలులు కలదియు అగు, **అనయోర్మధ్యం** - ఆ రెండు (రవిమయ, చంద్రమయ) ప్రాకారముల మధ్య ప్రదేశమును, **ఈడే** - వినుతించుచున్నాను !!
- **తాత్పర్యము:** రవిమయ (24వ) ప్రాకారమునకు పై భాగము నందు, హిమవత్పర్వతము వలె తెల్లగా ఉన్నది, వెన్నెల కిరణాలు కలిగిన చంద్రమయ (25వ) ప్రాకారమును, ఈ రెండు ప్రాకారముల మధ్యన ఉండే చల్లని గాలులు కలిగిన ప్రదేశమును నేను వినుతించుచున్నాను !!
- **విశేషాలు:** ఈ శ్లోకంలో రవిమయ ప్రాకారానికి పైన ఉన్న హిమవత్పర్వతం వలె తెల్లటి చంద్రమయ ప్రాకారం వర్ణించబడింది. ఈ రెండు ప్రాకారాల మధ్య ప్రదేశం చల్లని గాలులతో నిండి, వెన్నెల కాంతులతో ప్రకాశిస్తూ ఉంటుంది.

**॥ ఆర్యా ద్విశతి - 102వ శ్లోకము ॥**

- **శ్లోకము:** తత్ర ప్రకాశమానం తారానికరైః పరిష్కృతోద్దేశమ్ | అమృతమయకాంతికందళమంతః కలయామి కుందసితమిందుమ్ || ౧౦౨
- **ప్రతిపదార్థము: తత్ర** - ఆ ప్రదేశమునందు, **ప్రకాశమానం** - ప్రకాశించుచున్నవాడును, **తారానికరైః** - నక్షత్రముల గణములచేత, **పరిష్కృత** - అలంకరింపబడిన, **ఉద్దేశం** - ప్రదేశము కలవాడును, **అమృతమయ** - అమృతస్వరూపమైన, **కాంతి** - కిరణముల యొక్క, **కందళం** - మొలకలు కలవాడు, **కుందసితం** - మల్లెపూవులవలె తెల్లని కాంతి కలవాడును అగు, **ఇందుం** - చంద్రుని, **అంతః** - మనస్సునందు, **కలయామి** - ధ్యానించుచున్నాను !!
- **తాత్పర్యము:** ఇందుమయ ప్రాకారమునందు, నక్షత్రములచేత అలంకరింపబడిన ప్రదేశమునందు, అమృతస్వరూపమైన కాంతి కిరణములు కలవాడు, మల్లెపూవులవలె తెల్లని కాంతి కలవాడు అయిన చంద్రుని మనస్సునందు ధ్యానించుచున్నాను !

- **విశేషాలు:** ఈ శ్లోకంలో చంద్రమయ ప్రాకారంలో ప్రకాశిస్తున్న చంద్రుడు వర్ణించబడ్డాడు. నక్షత్రాల సమూహంతో అలంకరించబడిన ప్రదేశంలో ఆయన అమృతమయమైన కాంతి కిరణాలతో మరియు మల్లెపూవు వలె తెల్లని కాంతితో ప్రకాశిస్తున్నాడు.

**|| ఆర్యా ద్విశతి - 103వ శ్లోకము ||**

- **శ్లోకము:** శృంగారసాలమీడే శృంగోల్లసితం తదుత్తరే భాగే | మధ్యస్థలే తయోరపి మహితాం శృంగారపూర్వికాం పరిఖామ్ || ౧౦౩
- **ప్రతిపదార్థము: తదుత్తరే భాగే** - ఆ చంద్రమయ ప్రాకారమునకు పై భాగము నందు ఉండు, **శృంగోల్లసితం** - శిఖరములచేత ప్రకాశించునట్టి, **శృంగారసాలం** - శృంగార రసమయమైన ప్రాకారమును, **తయోరపి** - ఆ రెండు (చంద్రమయ, శృంగారమయ) ప్రాకారముల, **మధ్యస్థలే** - మధ్య ప్రదేశమునందు, **మహితాం** - మహిమ కలదియు, **విపులాం** - విశాలమైనదియు అగు, **శృంగారపూర్వికాం పరిఖామ్** - శృంగారపు నడబావిని, **ఈడే** - నుతించుచున్నాను !!
- **తాత్పర్యము:** చంద్రమయ (25వ) ప్రాకారమునకు పై భాగము నందు ఉండు, శిఖరములచేత ప్రకాశించునట్టిది, శృంగారరసమయ (26వ) ప్రాకారమును, ఆ రెండు ప్రాకారముల మధ్య ప్రదేశమునందు, గొప్ప మహిమ కలిగిన, విశాలమైనది అయిన శృంగార బావిని నేను నుతించుచున్నాను !!
- **విశేషాలు:** ఈ శ్లోకంలో చంద్రమయ ప్రాకారానికి పైన ఉన్న శిఖరాలతో ప్రకాశిస్తున్న శృంగారమయ ప్రాకారం వర్ణించబడింది. ఈ రెండు ప్రాకారాల మధ్య గొప్ప మహిమ కలిగిన విశాలమైన శృంగారపు బావి ఉంది. కవి ఈ ప్రాకారాన్ని మరియు బావిని స్తుతిస్తున్నారు.

**|| ఆర్యా ద్విశతి - 104వ శ్లోకము ||**

- **శ్లోకము:** తత్ర మణినౌస్థితాభిస్తపనీయారచిత శృంగహస్తాభిః | శృంగారదేవతాభిస్సహితం పరిఖాధిపం భజే మదనమ్ || ౧౦౪
- **ప్రతిపదార్థము: తత్ర** - ఆ శృంగారపు బావియందు ఉన్న, **మణినౌస్థితాభిః** - మణులచే నిర్మింపబడిన పడవల యందు కూర్చున్న వారును, **తపనీయరచిత** - బంగారముచేత చేయబడిన, **శృంగ** - కొమ్ములు, **హస్తాభిః** - చేతులయందు ధరించినవారును అగు, **శృంగారదేవతాభిః** - శృంగారుదేవతా స్త్రీలతో, **సహితం** - కూడిన, **పరిఖాధిపం** - ఆ అగడ్తకు అధిదేవతయైన, **మదనం** - మన్మథుని, **భజే** - కొలుచుచున్నాను !!
- **తాత్పర్యము:** ఆ శృంగారపు బావి యందు, మణులచేత నిర్మింపబడిన పడవలయందు కూర్చుని, బంగారు కొమ్ములను హస్తములయందు ధరించిన శృంగారదేవతా స్త్రీలతో కూడి ఉన్న, ఆ బావికి అధిదేవతయైన మన్మథుడిని నేను కొలుచుచున్నాను !!

- **విశేషాలు:** ఈ శ్లోకంలో శృంగారపు బావిలో మణిమయమైన పడవలలో కూర్చున్న శృంగార దేవతలతో కలిసి ఉన్న మన్మథుడిని కవి భజిస్తున్నారు. ఆ దేవతలు బంగారు కొమ్ములను చేతుల్లో ధరించి ఉన్నారు. మన్మథుడు ఈ శృంగారపు బావికి అధిపతిగా వర్ణించబడ్డాడు.

**॥ ఆర్యా ద్విశతి - 105వ శ్లోకము ॥**

- **శ్లోకము:** శృంగారవరణవర్యస్యోత్తరతస్సకలవిబుధ సంసేవ్యమ్ | చింతామణిగణరచితం చింతాం దూరీకరోతు మే సదనమ్ || ౧౦౫
- **ప్రతిపదార్థము: శృంగారవరణవర్యస్య** - శృంగారమయమైన శ్రేష్ఠమైన ప్రాకారమునకు, **ఉత్తరతః** - పై భాగము నందు ఉండు, **సకలవిబుధ** - సమస్త దేవతలచేత, **సంసేవ్యం** - ఆరాధింపదగినదియు, **చింతామణిగణరచితం** - చింతామణులచేత చేయబడినదియు అగు, **సదనం** - గృహము, **మే చింతాం** - నా యొక్క వ్యసనమును, చింతలను, **దూరీకరోతు** - పోగొట్టుగాక !!
- **తాత్పర్యము:** శ్రేష్ఠమైన శృంగారమయ ప్రాకారమునకు పై భాగము నందు, సమస్త దేవతలచేత ఆరాధింపబడునది, చింతామణులచేత చేయబడినదియు అగు చింతామణి గృహము - నా యొక్క చింతలను దూరముచేయుగాక !!
- **విశేషాలు:** ఈ శ్లోకంలో శృంగారమయ ప్రాకారానికి పైన ఉన్న చింతామణి గృహం వర్ణించబడింది. ఇది సమస్త దేవతలచే ఆరాధింపబడుతుంది మరియు చింతామణులచే నిర్మించబడింది. ఈ గృహం భక్తుల యొక్క చింతలను మరియు దుఃఖాలను తొలగిస్తుందని విశ్వసిస్తారు.

**॥ ఆర్యా ద్విశతి - 106వ శ్లోకము ॥**

- **శ్లోకము:** మణిసదనసాలయోరధిమధ్యం దశతాళ భూమిరుహదీర్ఘైః | పర్ణైస్సువర్ణవర్ణైర్యుక్తాం కాండైశ్చ యోజనోత్తుంగైః || ౧౦౬
- **ప్రతిపదార్థము: మణిసదనసాలయోః** - శృంగార, మణిమయ సాలములకు, **అధిమధ్యం** - మధ్య ప్రదేశమున, **దశ** - పది, **తాళభూమిరుహ** - తాటిమ్రాకుల అంతటి, **దీర్ఘైః** - పొడవైన, **సువర్ణవర్ణైః** - బంగారు వర్ణము కలిగిన, **పర్ణైః** - ఆకులతోనూ, **యోజనోత్తుంగైః** - ఒక యోజనము పొడవు కలిగిన, **కాండైశ్చ** - కాండములతో, **యుక్తాశ్చ** - కూడినదియు ...
- **తాత్పర్యము:** శృంగారమయ, మణిసదన సాలములకు మధ్య ప్రదేశమునందు, పది తాటిమ్రాకుల అంతటి పొడవైన, బంగారు వర్ణములో ఉన్న ఆకులతోనూ, యోజనము పొడవైన కాండములతో కూడినదియు అయిన కల్పవృక్షాల వనాన్ని ధ్యానించుచున్నాను.

- **విశేషాలు:** ఈ శ్లోకంలో శృంగారమయ మరియు మణిమయ ప్రాకారాల మధ్య ఉన్న కల్పవృక్షాల వనం వర్ణించబడింది. ఈ వృక్షాలు చాలా పొడవుగా, బంగారు రంగు ఆకులతో మరియు యోజనాల పొడవైన కాండాలతో ఉంటాయి.

**॥ ఆర్యా ద్విశతి - 107వ శ్లోకము ॥**

- **శ్లోకము:** మృదులైః స్తాళీపంచకమానైర్మిళితాం చ కేసరకదంబైః | సంతత గళిత మరందస్రోతో నిర్యన్మిళిందసందోహమ్ || ౧౦౭
- **ప్రతిపదార్థము: మృదులైః** - మృదులమైనదియు (మెత్తనివియు), **తాళీపంచకమానైః** - ఐదు తాటి ఆకుల పొడవైనదియు, **సంతత** - ఎల్లప్పుడూ, **గళిత** - స్రవించుచున్న, **మరందస్రోతః** - తేనె ప్రవాహములయందు ఉండి, **నిర్యత్** - బయటకి వస్తున్న, **మిళింద** - తుమ్మెదల యొక్క, **సందోహం** - గుంపులు కలదియు, **కేసరకదంబైః** - కేసరముల గుంపుతో, **మిళితాం** - కూడినదియు...
- **తాత్పర్యము:** మృదులమైనవియు, ఐదు తాటి ఆకుల పొడవు కలిగినవియు, ఎల్లప్పుడూ స్రవించుచున్న తేనె ప్రవాహములనుండి బయటకి వస్తున్న తుమ్మెదల గుంపులు కలదియు, కేసరముల గుంపుతో కూడినదియు అయిన కల్పవృక్షాల వనాన్ని ధ్యానించుచున్నాను.
- **విశేషాలు:** ఈ శ్లోకంలో కల్పవృక్షాల ఆకులు మరియు పువ్వులు వర్ణించబడ్డాయి. ఆకులు మృదువుగా మరియు ఐదు తాటి ఆకుల పొడవు ఉంటాయి. పువ్వులు కేసరాల గుంపులతో నిండి ఉంటాయి మరియు వాటి నుండి ఎల్లప్పుడూ తేనె ప్రవహిస్తూ ఉంటుంది, దాని చుట్టూ తుమ్మెదల గుంపులు తిరుగుతూ ఉంటాయి.

**॥ ఆర్యా ద్విశతి - 108వ శ్లోకము ॥**

- **శ్లోకం:**
- **సన్తత గళిత మరన్ద స్రోతో నిర్యన్మిళిన్ద సన్దోహామ్ | కలహంసీ కుల కలకల కూలజ్కష నినద నిచయ కమనీయామ్। 108**
- **ప్రతిపదార్థం:**
- **సన్తత - నిరంతరము**
- **గళిత - స్రవించుచున్న**
- **మరన్ద - మకరందము యొక్క**
- **స్రోతో - ప్రవాహముల వలన**
- **నిర్యన్మిళిన్ద - బయటకు వచ్చుచున్న తుమ్మెదల యొక్క**
- **సన్దోహామ్ - సమూహములు కలది**
- **కలహంసీ - హంసల యొక్క**

- **కుల - సమూహముల యొక్క**
- **కలకల - కలకల ధ్వనుల యొక్క**
- **కూలఙ్కష - ఒడ్డులను తాకుచున్న**
- **నినద - ధ్వనుల యొక్క**
- **నిచయ - సమూహములచే**
- **కమనీయామ్ - అందమైనది (ఓ దేవీ!)**
- **తాత్పర్యం:**
- **ఓ దేవీ! నిరంతరము స్రవించుచున్న మకరందపు ప్రవాహాల వలన బయటకు వస్తున్న తుమ్మెదల సమూహాలతోను, హంసల గుంపుల యొక్క కలకల ధ్వనులు ఒడ్డులను తాకుతూ వినబడుతున్న శబ్దాల సమూహాలతోను నీవు ఎంత అందంగా ఉన్నావు.**
- **విశేషాలు:**
- **ఈ శ్లోకం దేవి యొక్క సౌందర్యాన్ని వర్ణిస్తుంది. ప్రకృతిలోని అందమైన అంశాలను ఉపమానంగా తీసుకుని దేవి యొక్క మనోహరత్వాన్ని కవి తెలియజేస్తున్నాడు.**
- **"సన్తత గళిత మరన్ద స్రోతో నిర్యన్మిళిన్ద సన్దోహామ్" అనే పాదంలో, పువ్వుల నుండి నిరంతరం కారుతున్న మకరందం కోసం వచ్చే తుమ్మెదల గుంపులు దేవి చుట్టూ తిరుగుతున్నట్లుగా ఊహించవచ్చు. ఇది దేవి యొక్క ఆకర్షణీయమైన శక్తిని సూచిస్తుంది.**
- **"కలహంసీ కుల కలకల కూలఙ్కష నినద నిచయ కమనీయామ్" అనే పాదంలో, హంసల యొక్క ఆహ్లాదకరమైన ధ్వనులు నదీ తీరాలలో ప్రతిధ్వనిస్తున్నట్లు వర్ణించబడింది. హంసలు స్వచ్ఛతకు మరియు అందానికి చిహ్నం. వాటి కలకల ధ్వనులు దేవి యొక్క ఉనికిని మరింత శోభాయమానం చేస్తున్నాయి.**
- **ఈ శ్లోకంలో శబ్దాలంకారానికి ప్రాధాన్యత ఇవ్వబడింది. "కలకల", "నినద" వంటి పదాలు శ్రవణానందాన్ని కలిగిస్తున్నాయి.**
- **"కూలఙ్కష నినద" అనే పదం యొక్క అర్థం చాలా శక్తివంతమైనది. అలలు ఒడ్డును తాకినప్పుడు వచ్చే ధ్వని వలె, హంసల కలకల ధ్వనులు కూడా పరిసరాలను నింపుతున్నాయని భావం.**
- **ఈ శ్లోకం దేవి యొక్క దివ్యమైన సౌందర్యాన్ని ప్రకృతిలోని మధురమైన దృశ్యాలు మరియు శబ్దాలతో ముడిపెట్టి వర్ణిస్తుంది, ఇది పాఠకులకు ఒక అద్భుతమైన అనుభూతిని కలిగిస్తుంది.**
- **|| ఆర్యా ద్విశతి - 109వ శ్లోకము ||**

- **శ్లోకము:** పాటీరపవనబాలక ధాటీనిర్యత్పరాగపింజరితామ్ | పద్మాటవీం భజామః పరిమళ కల్లోల పక్ష్మలోపాంతామ్ || ౧౦౮
- **ప్రతిపదార్థము: పాటీర** - చందనము వలె చల్లనిదియు, సువాసన గలదియు, **పవనబాలక** - మలయ మారుతములయొక్క, **ధాటీ** - వీచుటచేత, **నిర్యత్** - ప్రసరించుచున్న, **పరాగ** - పుష్పాడుల చేత, **పింజరితాం** - పసుపువన్నె గలదిగా చేయబడినదియు, **పరిమళ** - సువాసనల యొక్క, **కల్లోల** - పరంపరచేత, **పక్ష్మల** - వృద్ధి పొందింపబడిన (నిండిన), **ఉపాంతాం** - సమీప ప్రదేశములు కలదియు అగు, **పద్మాటవీం** - కమలవనమును, **భజామః** - సేవించుచున్నాను !!
- **తాత్పర్యము:** చందనము వలె చల్లనిదియు, చక్కని సువాసనలు కలిగినదియు, మలయ మారుతములు వీచుటచేత పుప్పొడి రాలి పసుపు రంగులో చేయబడినదియు, సువాసనలచే నిండిన పద్మముల వనమును నేను సేవించుచున్నాను !!
- **విశేషాలు:** ఈ శ్లోకంలో కల్పవృక్షాల వనం మధ్యలో ఉన్న కమలవనం వర్ణించబడింది. చల్లని మరియు సువాసనగల మలయ మారుతం వీచడం వల్ల పుప్పొడి రాలి పసుపు రంగులో ఉంటుంది. ఈ వనం సువాసనల యొక్క అలలతో నిండి ఉంటుంది మరియు దాని సమీప ప్రదేశాలు కూడా సువాసనతో నిండి ఉంటాయి. కవి ఈ పద్మవనాన్ని సేవిస్తున్నాడు.

**|| ఆర్యా ద్విశతి - 110వ శ్లోకము ||**

- **శ్లోకము:** దేవ్యర్ఘ్యపాత్రధారీ తస్యాః పూర్వదిశి దశకలాయుక్తః | వలయిత మూర్తిర్భగవాన్ వహ్నిః క్రోశోన్నత శ్చిరంజీయాత్ || ౧౦౯
- **ప్రతిపదార్థము: తస్యాః పూర్వదిశి** - కమలవనమునకు తూర్పు దిక్కున ఉండు, **దశకలాయుక్తః** - దశ కళలతో ఉండు వాడును, **దేవ్యర్ఘ్య పాత్రధారీ** - పరమేశ్వరి యొక్క పూజా పాత్రలను ధరించినవాడును, **వలయితమూర్తిః** - గుండ్రమైన ఆకారము కలవాడును, **క్రోశోన్నతః** - ఒక క్రోశము (రెండు మైళ్ళ) పొడవైనవాడును, **భగవాన్** - భగవంతుడు, మహిమవంతుడు అయిన, **వహ్నిః** - అగ్నిదేవుడు, **చిరం** - ఎల్లప్పుడూ, **జీయాత్** - సర్వోత్కృష్టముగా వర్ధిల్లుగాక !!
- **తాత్పర్యము:** కమలవనమునకు పూర్వ దిక్కులో, పది కళలతో కూడినవాడు, లలితాంబిక యొక్క పూజా పాత్రలను ధరించినవాడును, గుండ్రమైన ఆకారము కలవాడును, క్రోశము పొడవు కలవాడును, భగవంతుడు అయిన అగ్నిదేవుడు ఎల్లప్పుడూ వర్ధిల్లుగాక !!
- **విశేషాలు:** ఈ శ్లోకంలో కమలవనానికి తూర్పు దిక్కున ఉన్న అగ్నిదేవుడు వర్ణించబడ్డాడు. ఆయన పది కళలతో ప్రకాశిస్తున్నాడు మరియు లలితాంబిక యొక్క పూజా పాత్రలను ధరించి ఉన్నాడు. ఆయన గుండ్రని ఆకారంతో మరియు రెండు మైళ్ళ పొడవుతో ఉన్నాడు. ఆయన ఎల్లప్పుడూ గొప్పగా వర్ధిల్లాలని కవి కోరుకుంటున్నారు.

**॥ ఆర్యా ద్విశతి - 111వ శ్లోకము ॥**

- **శ్లోకము:** తత్రాధారే దేవ్యాః పాత్రీభూతః ప్రభాకరః శ్రీమాన్ | ద్వాదశకలాసమేతో ధ్వాంతం మమ బహుళ మాంతరం భింద్యాత్ || ౧౧౧
- **ప్రతిపదార్థము: తత్రాధారే** - ఆ పూజాపాత్రా ధారయందు, **దేవ్యాః** - ప్రకాశించుచున్నవాడును, **పాత్రీభూతః** - పాత్రముగా అగుచున్నట్టివాడునూ, **శ్రీమాన్** - సంపదలతో కూడినవాడును, **ద్వాదశకలాసమేతః** - పండ్రెండు కళలతో కూడినవాడు అగు, **ప్రభాకరః** - సూర్యుడు, **మమ** - నా యొక్క, **ఆంతరం** - మనస్సునందలి, **బహుళం** - అధికమైన, **ధ్వాంతం** - చీకటిని (అజ్ఞానమును), **భింద్యాత్** - నశింపజేయుగాక !!
- **తాత్పర్యము:** ఆ పూజాపాత్రా ధార యందు ప్రకాశించుచున్నవాడును, పాత్రముగా అవుతున్నట్టి వాడునూ, సంపదలతో కూడిన వాడునూ, పన్నెండు కళలతో కూడిన సూర్యభగవానుడు నా మనస్సునందలి చీకటిని, అజ్ఞానాన్ని నశింపజేయుగాక !!
- **విశేషాలు:** ఈ శ్లోకంలో లలితాదేవి యొక్క పూజాపాత్రకు ఆధారమైన సూర్యభగవానుడు వర్ణించబడ్డాడు. ఆయన పన్నెండు కళలతో ప్రకాశిస్తూ సంపదలతో నిండి ఉన్నాడు. కవి తన మనస్సులోని అజ్ఞానమనే చీకటిని ఆయన తొలగించాలని ప్రార్థిస్తున్నారు.

**॥ ఆర్యా ద్విశతి - 112వ శ్లోకము ॥**

- **శ్లోకము:** తస్మిన్ దినేశపాత్రే తరంగితామోద మమృతమయమర్ఘ్యమ్ | చంద్రకళాత్మకమమృతం సాంద్రీకుర్యాదమందమానందమ్ || ౧౧౧
- **ప్రతిపదార్థము: తస్మిన్** - ఆ, **దినేశపాత్రే** - సూర్యుడనెడు పూజాపాత్రమునందు, **తరంగిత** - ప్రసరించుచున్న, **ఆమోదం** - పరిమళముగల, **అమృతమయం** - అమృతమయమైన, **అర్ఘ్యం** - పూజ్యాద్రవ్యమును, **చంద్రకళాత్మకం** - చంద్రకళలమయమైన, **అమృతం** - అమృతమును, **అమందం** - అధికమైన, **ఆనందం** - సంతోషమును, **సాంద్రీకుర్యాత్** - అతిశయింపజేయుగాక !!
- **తాత్పర్యము:** ఆ సూర్యుడనెడు పూజాపాత్రయందు ప్రసరించుచున్న పరిమళములుగల అమృతమయమైన పూజాద్రవ్యము (అర్ఘ్యము), చంద్రకళాత్మకమైన అమృతమును, అధికమైన సంతోషములను కలుగజేయుగాక !!
- **విశేషాలు:** ఈ శ్లోకంలో సూర్యుడనే పూజాపాత్రలో ఉన్న అమృతమయమైన అర్ఘ్యం వర్ణించబడింది. ఇది సువాసనలు వెదజల్లుతూ చంద్రకళల వంటి అమృతంతో నిండి ఉంది. ఇది భక్తులకు అధికమైన ఆనందాన్ని కలిగిస్తుందని విశ్వసిస్తారు.

**॥ ఆర్యా ద్విశతి - 113వ శ్లోకము ॥**

- **శ్లోకము:** అమృతే తస్మిన్నభితో విహరంత్యో వివిధమణి తరణిభాజః | షోడశకలాస్సుధాంశోశ్శోకాదుత్తారయంతు మామనిశమ్ || ౧౧౨
- **ప్రతిపదార్థము: తస్మిన్ అమృతే** - ఆ అమృతమునందు, **అభితః** - చుట్టునూ, **విహరంత్యః** - విహరించుచున్నవారునూ, **వివిధ మణి తరణిభాజః** - నానా విధములైన రత్నములు చెక్కిన పడవలను కలవారును, **సుధాంశోః షోడశకలాః** - చంద్రుని యొక్క పదహారు కళలు, **మాం** - నన్ను/మమ్మల్ని, **అనిశం** - ఎల్లప్పుడూ, **శోకాదుత్తారయంతు** - దుఃఖము నుండి తరింపజేయుగాక !!
- **తాత్పర్యము:** ఆ అమృతము నందు చుట్టూ విహరించుచున్నవారును, నానావిధములైన మణులచేత, రత్నములచేత పొదగబడిన పడవలు కలవారును అయిన చంద్రుని యొక్క పదహారు కళలు మమ్మల్ని ఎల్లప్పుడూ దుఃఖముల నుండి తరింపజేయుగాక !!
- **విశేషాలు:** ఈ శ్లోకంలో అమృతంలో విహరిస్తున్న చంద్రుని యొక్క పదహారు కళలు వర్ణించబడ్డాయి. ఈ కళలు వివిధ రత్నాలతో అలంకరించబడిన పడవలలో తిరుగుతూ ఉంటాయి. ఈ పదహారు కళలు భక్తులను దుఃఖాల నుండి విముక్తి చేస్తాయని విశ్వసిస్తారు.

**|| ఆర్యా ద్విశతి - 114వ శ్లోకము ||**

- **శ్లోకము:** తత్రైవ విహృతిభాజో ధాతృముఖానాం చ కారణేశానామ్ | సృష్ట్యాదిరూపికాస్తాశ్శమయంత్వఖిలాః కలాశ్చ సంతాపమ్ || ౧౧౩
- **ప్రతిపదార్థము: తత్రైవ** - అచటనే, **విహృతిభాజః** - విహరించుచున్న, **కారణేశానాం** - సృష్ట్యాది కారణములకు అధిపతులగు, **ధాతృముఖానాం చ** - బ్రహ్మ మొదలైన వారి యొక్క, **సృష్ట్యాదిరూపికాః** - సృష్టి మొదలగు రూపములు గల (సృష్టి, స్థితి, లయ రూపములు), **తాః అఖిలాః కలాశ్చ** - ఆ సమానమైన విద్యలును, **సంతాపం** - కష్టమును, **శమయంతు** - పోగొట్టుదురుగాక !!
- **తాత్పర్యము:** అచటనే విహరించుచున్న, సృష్ట్యాది కారణములకు అధిపతులగు బ్రహ్మ మొదలైన వారియొక్క సృష్టి, స్థితి, లయ రూపములు గల విద్యలు, మా యొక్క కష్టములను/సంతాపమును పోగొట్టుదురుగాక !!
- **విశేషాలు:** ఈ శ్లోకంలో సృష్టి, స్థితి, లయలకు కారకులైన బ్రహ్మాది దేవతల యొక్క శక్తులు వర్ణించబడ్డాయి. ఈ శక్తులు వివిధ కళలుగా విహరిస్తూ భక్తుల యొక్క దుఃఖాలను మరియు బాధలను తొలగిస్తాయి.

**|| ఆర్యా ద్విశతి - 115వ శ్లోకము ||**

- **శ్లోకము:** కీనాశవరుణ కిన్నరరాజదిగంతేషు రత్నగేహస్య | కలయాన్వితాన్యజస్రం కలయంత్వాయుష్య మర్ఘపాత్రాణి || ౧౧౪
- **ప్రతిపదార్థము: కీనాశ** - యముడు, **వరుణ** - వరుణుడు, **కిన్నరరాజ** - కుబేరుడు (వీరియొక్క), **దిగంతేషు** - దిక్కులకొనలయందు (దక్షిణ, పడమర, ఉత్తర దిశలయందు), **కలయా అన్వితాని** - కళలతో కూడిన, **అర్ఘపాత్రాణి** - పూజాద్రవ్యములు గల పాత్రలు, **అజస్రం** - ఎల్లప్పుడూ, **ఆయుష్యం కలయంతు** - దీర్ఘాయుష్షును ఇత్తురుగాక !!
- **తాత్పర్యము:** యముడు, వరుణుడు, కుబేరుని దిక్కుల యందు (దక్షిణ, పడమర, ఉత్తర) కళలతో కూడిన పూజాద్రవ్యములు గల పాత్రలు, ఎల్లప్పుడూ మాకు దీర్ఘాయుష్షును ఇచ్చెదరుగాక !!
- **విశేషాలు:** ఈ శ్లోకంలో యముడు (దక్షిణ), వరుణుడు (పడమర), కుబేరుడు (ఉత్తర) ఉండే దిక్కులలో కళలతో నిండిన అర్ఘ్యపాత్రలు వర్ణించబడ్డాయి. ఈ పాత్రలు భక్తులకు దీర్ఘాయువును ప్రసాదిస్తాయని నమ్ముతారు. అర్ఘ్యంలో సాధారణంగా నీరు, పాలు, కుశాగ్రం, పెరుగు, నెయ్యి, బియ్యం, యవలు మరియు తెల్ల ఆవాలు ఉంటాయి.

**|| ఆర్యా ద్విశతి - 116వ శ్లోకము ||**

- **శ్లోకము:** పాత్రస్థలస్య పురతః పద్మారమణ విధి పార్వతీశానామ్ | భవనాని శర్మణే నో భవంతు భాసా ప్రదీపితజగంతి || ౧౧౫
- **ప్రతిపదార్థము: పాత్రస్థలస్య** - ఆ పాత్రలు గల ప్రదేశమునకు, **పురతః** - ఎదుట ఉండు, **భాసా ప్రదీపితజగంతి** - జగత్తులను ప్రకాశింపజేయుచున్న, **పద్మారమణ** - విష్ణువు, **విధి** - బ్రహ్మ, **పార్వతీశానాం** - శివుడు (వీరియొక్క), **భవనాని** - గృహములు, **నః శర్మణే భవంతు** - మాకు క్షేమమును అగుదురు గాక (అనుగ్రహింతురుగాక) !!
- **తాత్పర్యము:** ఆ పాత్రలు గల ప్రదేశమునకు ఎదుట ఉండు, జగత్తులను ప్రకాశింపజేయుచున్న, బ్రహ్మ విష్ణు శివుల గృహములు మాకు క్షేమమును కలుగజేయుదురుగాక !!
- **విశేషాలు:** ఈ శ్లోకంలో అర్ఘ్యపాత్రలు ఉన్న ప్రదేశానికి ఎదురుగా ఉన్న బ్రహ్మ, విష్ణు మరియు శివుల భవనాలు వర్ణించబడ్డాయి. ఈ భవనాలు తమ కాంతితో జగత్తును ప్రకాశింపజేస్తూ భక్తులకు క్షేమాన్ని కలిగిస్తాయని విశ్వసిస్తారు.

**|| ఆర్యా ద్విశతి - 117వ శ్లోకము ||**

- **శ్లోకము:** సదనస్యానలకోణే సతతం ప్రణమామి కుండమాగ్నేయమ్ | తత్ర స్థితం చ వహ్నిం తరళశిఖాజటిల మంబికాజనకమ్ || ౧౧౬
- **ప్రతిపదార్థము: సదనస్య ఆనలకోణే** - ఆ చింతామణి గృహమునకు ఆగ్నేయ దిక్కునందు, **ఆగ్నేయం కుండమ్** - అగ్నిమయమైన పల్లమును (కుండమును), **తత్ర స్థితం చ వహ్నిం** -

అచ్చటనున్న అగ్నిని, **తరళశిఖాజటిలం** - చలించుచున్న జ్వాలలచేత పూర్ణమైనదియు, **అంబికాజనకం** - పార్వతీదేవికి తండ్రియైనవాడును అగు (చిదగ్నికుండసంభూత అని శ్రీలలితాదేవి నామము), **సతతం ప్రణమామి** - ఎల్లప్పుడూ నమస్కరించుచున్నాను !!

- **తాత్పర్యము:** చింతామణిగృహమునకు ఆగ్నేయ దిక్కునందు అగ్నిమయమైన కుండమును, అందులో చలించుచున్న అగ్నిశిఖలచేత పూర్ణమైనవాడును, చిదగ్నికుండసంభూత యొక్క తండ్రిగా పేర్కొనబడిన అగ్నిదేవుని ఎల్లప్పుడూ నమస్కరించుచున్నాను !
- **విశేషాలు:** ఈ శ్లోకంలో చింతామణి గృహానికి ఆగ్నేయ దిక్కున ఉన్న అగ్నికుండం మరియు అందులో ఉన్న అగ్నిదేవుడు వర్ణించబడ్డారు. ఈ అగ్ని చలించే జ్వాలలతో నిండి ఉన్నాడు మరియు లలితాదేవి (చిదగ్నికుండసంభూత) యొక్క తండ్రిగా భావించబడతాడు. కవి ఆయనకు ఎల్లప్పుడూ నమస్కరిస్తున్నాడు.

**|| ఆర్యా ద్విశతి - 118వ శ్లోకము ||**

- **శ్లోకము:** తస్యాసురదిశి తాదృశ రత్నపరిస్ఫురిత పర్వనవకాఢ్యమ్ | చక్రాత్మకం శతాంగం దశయోజనమున్నతం భజే దివ్యమ్ || ౧౧౭
- **ప్రతిపదార్థము: తస్య ఆసురదిశి** - ఆ చింతామణి గృహము యొక్క నైఋతి దిక్కునందు ఉండు, **తాదృశ రత్నపరిస్ఫురిత** - ఆ చింతామణి గృహము నందు ఉన్న రత్నములు, మణులచేత గొప్పగా ప్రకాశించుచున్న, **పర్వనవకాఢ్యం** - తొమ్మిది వరుసలతో కూడిన, **దశయోజనమున్నతం** - పదియోజనముల పొడవు కలిగినదియు, **చక్రాత్మకం** - చక్రములు కలదియు అగు, **దివ్యం శతాంగం** - ప్రకాశించుచున్న రథమును, **భజే** - సేవించుచున్నాను !!
- **తాత్పర్యము:** చింతామణి గృహమునకు నైఋతి దిక్కునందు ఉన్న రత్నములచేత పొదగబడి గొప్పగా ప్రకాశించుచూ, తొమ్మిది వరుసలతో కూడి పదియోజనముల పొడవు కలిగినది, చక్రములు కలిగిన రథమును సేవించుచున్నాను !!
- **విశేషాలు:** ఈ శ్లోకంలో చింతామణి గృహానికి నైఋతి దిక్కున ఉన్న ఒక దివ్యమైన రథం వర్ణించబడింది. ఇది రత్నాలతో ప్రకాశిస్తూ, తొమ్మిది అంతస్తులు కలిగి, పది యోజనాల ఎత్తులో ఉంది మరియు అనేక చక్రాలను కలిగి ఉంది. కవి ఈ రథాన్ని సేవిస్తున్నాడు.

**|| ఆర్యా ద్విశతి - 119వ శ్లోకము ||**

- **శ్లోకము:** తత్రైవ దిశి నిషణ్ణం తపనీయధ్వజ పరంపరాశ్లిష్టమ్ | రథమపరం చ భవాన్యా రచయామో మనసి రత్నమయచూడమ్ || ౧౧౮
- **ప్రతిపదార్థము: తత్రైవ దిశి** - ఆ నైఋతి దిక్కునందే, **నిషణ్ణం** - ఉన్నదియు, **తపనీయధ్వజ పరంపరాశ్లిష్టమ్** - బంగారు ధ్వజము(పతాకముల) యొక్క వరుసలచేత కూడినదియు,

